## గంటల పంచాంగం

శ్రీ దుర్ముఖి సం॥ చైత్ర బ॥ ప్రథమ 1956- సం॥ ఏప్రిల్ 26 గురువారం కు॥ ప్రథమ 7-35 విశా రా 0-17 లే వర్జ్యం 6-50 ని వర్జ్యం గా 4-55ల. బ॥ ద్వితీయ ఏప్రిల్ 27 శుక్రవారం కు॥ ద్వితీయ 8.52 అనూ. రా 2-14 వర్జ్యం లే 6.40 ని.



ఆంధ్రపత్రిక

ఒకరి కొరకు మనశరించిన
దరవర దుర్భిలను దర మనంబున దగు దా
పొరులకు పరి సేయకుసది
పరాయణము వరమధర్మపథములనెల్లన్
(మహాభారతము)

శ్రీ దుర్ముఖి సం॥ చైత్ర బ॥ ప్రథమ
గురువారం

## రష్యా-బ్రిటన్ సంబంధాలు

సోవియట్ నాయకుల బ్రిటన్ పర్యటన బాదాపు పూర్తి అయింది. ఈ పర్యటన జయప్రదమైనట్లు కన్పించదు. ఫలప్రదమైనట్లు తోచదు. ప్రపంచ సమస్య లన్నింటి మీదా రష్యా, బ్రిటన్ నాయకులు దీర్ఘంగా, విపులంగా చర్చలు జరిపారు. ఈ చర్చల్లో మధ్యప్రాచ్య సమస్యలు, ప్రాక్-పశ్చిమ యూరప్‌లమధ్య వ్యాపారం ప్రాధాన్యంవహించడం సహజమే. ప్రపంచ పరిస్థితులలో ఏర్పడిన ఉద్రిక్తతను తగ్గించడానికి జరిగే ప్రయత్నాలు సఫలం కావడానికి సహాయపడగలమని సోవియట్ నాయకులు హామీ ఇచ్చారు. అయినా బ్రిటిష్ ప్రధాన మంత్రితోనూ, ఇతర మంత్రులతోనూ రష్యానాయకులు పదిరోజులు జరిపిన సంప్రతింపులు ఏ ఒక సమస్యా పరిష్కారానికి తోడ్పడేటట్లు కన్పించడంలేదు. రెండు ప్రభుత్వాల మధ్యా, రెండు పక్షాలవారి మధ్యా ఏకాభిప్రాయం కంటే భిన్నాభిప్రాయాలే అధికంగా వుంటున్నట్లు స్పష్టమైంది.

సోవియట్ నాయకుల బ్రిటన్ పర్యటన ఫలితంగా పశ్చిమరాజ్యాల ఐకమత్యానికి, బ్రిటన్-అమెరికాల సహకారానికి ఏవిధమైన విఘాతము ఏర్పడలేదు. బ్రిటిష్ ప్రభుత్వ విధానాల్లోగాని, వైఖరిలోగాని మార్పేమీ రాలేదు. అరబ్-ఇస్రాయిల్ తగాదా పరిష్కారానికి, పశ్చిమ ఆసియాలో ఆయుధాలపోటీని వారించడానికి బ్రిట్ను సోవియట్ రష్యా సహకారాన్ని అభ్యర్థించింది. పశ్చిమ రాజ్యాలను, ముఖ్యంగా బ్రిటన్ అమెరికాలను ఎక్కువగా కలవరపెడుతున్న సమస్య పశ్చిమ ఆసియా రాజ్యాలమధ్య ఏర్పడిన ఆయుధాల పోటీ. ఈ సమస్యను న్యాయంగా పరిష్కరించడానికి రష్యా బ్రిటన్, అమెరికాలతో సహకరించడం అనుంభవం.

ప్రపంచ సమస్యలన్నింటినీ ఏకంగా, ఒకేసారి పరిష్కరించడానికి రష్యా పశ్చిమరాజ్యాలతో సహకరించవచ్చును. ఇందుకు కొన్ని త్యాగాలను కూడా చేయవచ్చును. ప్రస్తుత సంప్రతింపులలో బ్రిటిష్ ప్రతినిధులు ఇట్టి సర్వసమాధానపరిష్కారానికి ప్రతిపాదనలు చేయలేదు. ... బ్రిటిష్ కార్మికసేనా[illegible] సోవియట్ నాయకులకూ కొంత వాగ్వాదం జరిగింది. అధికార

సంప్రతింపులకూ ఈ సంఘటనకూ ఏవిధమైన సంబంధమూ లేకపోయినప్పటికీ, సంప్రతింపులు తృప్తికరంగా సమాప్తం కావడానికి అనుకూలమైన వాతావరణం లేకుండా పోయింది.

రష్యానాయకుల పర్యటన ఫలితంగా బ్రిటన్, రష్యా సంబంధాలైనా స్నేహభావంలో వృద్ధిఅయినవని చెప్పడానికి ఇంతవరకూ ఆధారాలు కన్పించడంలేదు. తిరిగి అగ్రరాజ్యాధిపతుల సమావేశం జరగడం అత్యంతావశ్యకమైనట్లు కన్పిస్తున్నది. ఆ సమావేశంలోనే విభేదాలను తొలగించడానికి ప్రయత్నాలు జరగాలి. రష్యా విధానాల్లో అమెరికా రాజ్యాంగ తంత్రజ్ఞులకు పూర్తి విశ్వాసం ఏర్పడకపోయినా, అమెరికా వైఖరిలో కొంత మార్పు గోచరిస్తున్నది. కనుక బ్రిటన్, అమెరికా, రష్యా సంప్రతింపులు ఫలప్రదం కావచ్చుననే ఆశ కలుగుచున్నది.

## చిత్తూరు జిల్లాలో భూదానం

### శ్రీ రామలింగారెడ్డి విజ్ఞప్తి

మదనపల్లి, ఏప్రిల్ 23: భూదాన సమితి అధ్వర్యమున నిన్న సాయంత్రం పంచాయతీ ఆవరణములో బహిరంగ సభలో వినోబాజీ కార్యదర్శి దామోదర దాస్, ఆంధ్ర రాష్ట్ర శాంతిసేనా నిర్వాహకుడు శ్రీ ఆర్. కె. రామలింగారెడ్డి భూదాన పుద్యమమును గురించి వివరిస్తూ పుపన్యసించారు. పూజ్య వినోబాజీ ఈ జిల్లాలో వచ్చేనెల 8వ తేదీ నుండి పాదయాత్ర ప్రారంభింప బోవుచున్నారనియు, ఆ సమయములో భూస్వాములు వినోబాజీ సందేశము మేరకు, భూదాన పత్రములు విరివిగా సమర్పింప వలెనని విజ్ఞప్తి చేశారు. సభకు సంబాలక్ నూతి రాధాకృష్ణయ్య అధ్యక్షత వహించారు.

## రేపల్లె తాలూకాలో పంచాయితీ ఎన్నికలు

రేపల్లె, ఏప్రిల్ 23: ఇంతవరకూ పమిడిముక్కల, పెనుమూడి, అరవపల్లి పంచాయితీ బోర్డుల ఎన్నికలు ఏకగ్రీవంగా జరిగినవి.

పమిడిముక్కల పంచాయితీ ఎన్నికలలో డిప్యూటీ పంచాయితీ ఆఫీసర్ శ్రీ పి. వెంకయ్య స్థానిక పంచాయితీ బోర్డు అధ్యక్షుని సహకారంతో చేసిన విశేష కృషివలన ఎన్నికలు ఏకగ్రీవంగా జరుగుటకు వీలయినది. ఎన్నుకోబడిన సభ్యులు: శ్రీయుతులు పెలగపూడి నాగభూషణచౌదరి, నర్రా పరంధామయ్య, పోతార్లంక గోవిందు, మూదల మునలయ్య, బిల్లా జాన్, పి. ప్రసాదరావు, చిన్నం భిక్షయ్య.

పెనుమూడి పంచాయితీ ఎన్నికలలో డిప్యూటీ పంచాయితీ ఆఫీసర్ శ్రీ వాసిరెడ్డి రామయ్య వోటర్ల సహకారంతో ఎన్నికలు ఏకగ్రీవంగా జరుగునట్లు చేశారు. ఏకగ్రీవంగా ఎన్నికైన సభ్యులు: శ్రీయుతులు మెట్టభీమశంకరరావు, కంతం వేంకట సుబ్బయ్య, వంపుగాళ్ళ దేవదానం, కొక్కిలగడ్డ కోటయ్య, నాగడి అద్దనుడు, దారం రాఘవులు, బన్నం రామేశ్వరం.

అరవపల్లి పంచాయితీ ఎన్నికల వివరాలు యింకా తెలియలేదు.

## శృంగవరంలో విశ్వదాత వర్ధంతి

శృంగవరం, ఏప్రిల్ 23: ఇక్కడ ద్రవిడరామమున బృందావన గార్డెన్సులో శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారి 18వ వర్ధంతి ఈనెల 21న శ్రీ ఆదివిశ్వ సుబ్రహ్మణ్య మోహన దాసుగారి అధ్యక్షతన జరుపబడినది.

నాగేశ్వరరావుగారు రాజకీయ, ఆర్థిక, సారస్వత ప్రజాభ్యుదయ రంగములలో యావదాంధ్ర ప్రజకు మార్గదర్శి అని ఉగ్గడించారు. అలాంటి మహనీయుడు లేనిలోటు యింకా తీరలేదన్నారు. వారు స్థాపించిన ఆంధ్రపత్రిక ప్రజలకు చేస్తున్న సేవను పలువురు ప్రశంసించారు. శ్రీ నాగేశ్వరరావుగారి ఆత్మ శాంతికొరకు ప్రార్థనలు జరుపబడినవి.

## ప్రిటన్‌కు యెమెన్ నిరసన

లండన్, ఏప్రిల్ 23: [illegible] ... బ్రిటన్ ప్రభుత్వానికి నిరసన తెలియ జేసింది.

[illegible] ... బ్రిటిష్ ప్రభుత్వాన్ని హెచ్చరించింది.

## ఆయుర్వేద వైద్యులు కలిసి పనిచేయాలి

### సముచితస్థానం సంపాదించాలి అని విజ్ఞప్తి

[స్వకీయ విలేఖరి]

రాజమండ్రి, ఏప్రిల్ 23: ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఆధునిక వైద్యముతోపాటు ఆయుర్వేదానికి కూడా సముచితమైన స్థానం లభింపచేసేందుకు ఆయుర్వేదవైద్యులు కలిసి కట్టుగా కృషిచేయాలని అ. భా. ఆయుర్వేద కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ వై. పార్థసారథి నారాయణ విజ్ఞప్తిచేశారు.

"వేలాది సంవత్సరాలుగా ఈభారత భూమిని ప్రజలకు కలిగే అస్వస్థతలను ప్రమాదకర వ్యాధుల నిర్మూలిస్తూ, ఆయురభివృద్ధికి కారణభూతమైన 'ఆయుర్వేద వైద్యవిధానము' శాస్త్రీయం గాదు అనే నెపమున మనజాతీయ ప్రభుత్వమువారిచే అనేక శాసనాల రూపములో అంతం చేయబడనున్నది! విదేశీయులు పాలించిన రోజులలో కూడ వారి అభిమాన వైద్యవిధానమునకు పోషణ, సంరక్షణ, ప్రోత్సాహమూ ఇచ్చారేగాని, మన దేశీయ అధునాతన ఆయుర్వేద విధానమును ఆడక త్తెరలో పెట్టి ఈ తిరించుపని చేయలేదు. దురదృష్టవశాత్తూ సమగ్రంగా తెలుసుకొనటానికి ప్రయత్నించకుండానే, ఆయుర్వేదముపట్ల మన ప్రభుత్వము అనిష్ట భావమును ప్రదర్శిస్తోంది! ఇట్టి తరుణంలో దేశంలోగల 3 లక్షల ఆయుర్వేద వైద్యులూ ఎవరు ఏకపలమువారు! ఎవరు ఎంత ఆర్జిస్తున్నారు! అనే అటమతికల తలపక, అంతా వైద్యకులను నకు చెందినవారము అనే ఐక్యభావముతో ఏకీభావముతో మన యీ ఆర్షవైద్య విధాన ఉత్కృష్టతను గురించి విమరక ప్రచారము చేయాలి. లోకసభలో 'ఆధునిక వైద్యము' తో బాటు 'ఆయుర్వేదము'నకు గూడ తగు స్థానమును ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఇచ్చి, యీవిధానమును గురించి ప్రభుత్వం వారు పోషించునట్లు కృషిచేసి, అచిరకాలంలో సఫలీకృతులం కావాలి" అని శ్రీ పార్థ నారాయణపండిట్ హెచ్చరించారు. నిన్న సాయంత్రము తిరుపతి రాయకాంగ్రెసు భవనములో శ్రీ స్వామీ ప్రజ్ఞానంద అధ్యక్షతను జరిగిన, రాజమండ్రి ఆయుర్వేద వైద్యుల సభ జరిగింది. ఆసభలో శ్రీ పార్థ నారాయణ ప్రసంగించారు.

తూర్పుగోదావరి జిల్లా ఆయుర్వేద వైద్యమండలి అధ్యక్షులు శ్రీ పొన్నాడ వెంకటాద్రి, కార్యదర్శి శ్రీ నాగాభట్ల సుబ్రహ్మణ్యశర్మ పండిట్జీని పూలమాలాలంకృతులజేసి స్వాగతమిచ్చారు. పండిట్‌జీతో ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి కార్యదర్శి శ్రీ కవిరాజ మోహన్ కూడా పర్యటనలో పాల్గొంటున్నారు.

శ్రీ పార్థనారాయణ తమ ప్రసంగంలో మే 7 తేదీని ఆయుర్వేదవైద్య ప్రతినిధులుగా తామున్నూ, పండిత శివశర్మగారున్నూ లోకసభ సభ్యుల సమావేశంలో ఆయుర్వేద శాస్త్రీయ తనూ-విధాన ప్రాశస్త్యమునూ, ఆధునిక వైద్యముతో బాటవిధానమునకు సమాన ప్రతిపత్తి యిచ్చుటేగాక అధిక ఆదరాభిమానము చూపవలసిన కారణములను వివరించబోతున్నామని తెలియజేశారు.

త్వరలోనే వెంగుటూరులో ఆయుర్వేద వైద్యవిధానముతో నడుపబడే కుష్ఠురోగ ఆసుపత్రిని యేర్పరుస్తున్నామన్నారు.

శ్రీ కవిరాజ మోహన్, శ్రీ చెన్నాప్రగడ, శ్రీ పొన్నాడ వెంకటాద్రి, శ్రీ నాగాభట్ల సుబ్రహ్మణ్యశర్మ లోదితరులు పండిట్జీ ఆగమనమునకు సంతోషం వెల్లడించారు.

సభాధ్యక్షులు శ్రీ స్వామీ ప్రజ్ఞానంద ఆయుర్వేద వైద్యవ్యం విదేశీయ ప్రభుత్వము అనాదరణవల్ల ఎట్లు దుర్గతి పాలైందీ వివరించారు. ఎన్ని ప్రతిబంధకాలెదురైనా ఎదుర్కొని యీనాటికి నిలచియున్న యీ భారతీయ వైద్యవిధానముపట్ల మన జాతీయ ప్రభుత్వము అభిమానమును చూపించకపోగా తిరస్కరించే (నిషేధించే) ఊహలలో నుండుట శోచనీయమనీ, దేశమందలి ఆయుర్వేద వైద్యులందరు యీ విషయములో విశేషముగా కృషిచేస్తే సఫలీకృతులవగలరని అన్నారు.

## మహారాష్ట్రుల అరెస్టు

### విరామ తీర్మానానికి సభాపతి తిరస్కృతి

న్యూఢిల్లీ, ఏప్రిల్ 21: సంయుక్త మహారాష్ట్రవ్యాప్తప్రదర్శకుల అరెస్టుచేసినందుకుగాను పార్లమెంటు కమ్యూనిస్టు సభ్యులు ఒక విరామ తీర్మానాన్ని ప్రతిపాదించగా సభాపతి శ్రీ అనంతశయనం అయ్యంగారు దాన్ని త్రోసిపేశారు.

ఢిల్లీలో నిన్న మొన్న ఇట్టి ప్రదర్శనలను జరిపిన రెండు రోజులలోను 625 మందిని అరెస్టుచేశారు. [illegible] మహారాష్ట్రంనుంచి ఇక్కడికి వచ్చారు. ఈ అరెస్టయిన వారిలో మహారాష్ట్ర హిందూమహాసభ కార్యదర్శి శ్రీ ఫిండే, శ్రీమందిరోర్కె (బొంబాయి)

ప్రభృతులు వున్నారు.

శాసనయంగమంత్రి శ్రీ పంత్ ఈ విరామ తీర్మానాన్నిగూర్చి మాట్లాడుతూ ప్రతిపక్షం ఆరెస్టుకు, ప్రదర్శనకు సంబంధించి విరామ తీర్మానాలు పెట్టే సభలో కార్యక్రమం సాగనీయకుండా కష్టం, శాంతిభద్రతల వ్యవహారాన్ని చూడవలసిన పోలీసులు ఈ అరెస్టులు చేయవలసి వచ్చింది. ఆ టీకాక ఈ ప్రదర్శకులు అరెస్టు అవుదామనే ఇక్కడకు వచ్చారని అన్నారు. మహారాష్ట్రులు బొంబాయి నగరాన్ని గూర్చి పొరపాటుగా వున్నారని చెప్పడానికి ఈ ప్రదర్శనలు అనవసరం. ఆ సంగతి అందరికీ తెలిసిందే అనిగూడా పండిత పంతు వివరంచేశారు.

## రాష్ట్రాల బిల్లుపై లోక్‌సభ చర్చ

### బొంబాయి కోసం శ్రీ గాడ్గిల్ వాదం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 24: ఇవ్వాళ రాష్ట్ర పునర్విభజనం బిల్లుపై జరిగిన చర్చలో పాల్గొన్న సభ్యులు అధిక సంఖ్యాకులు బొంబాయి నగరాన్ని మహారాష్ట్రంలో చేర్చాలన్న అభ్యర్థనను బలపరిచారు.

శ్రీ గాడ్గిల్ తన ప్రసంగంలో బొంబాయినగరం ఇవ్వాళ కాకపోతే, రేపన్నా మహారాష్ట్రంలో చేరబోదేనని ప్రకటించవలసిందిగా ప్రధానమంత్రిని కోరారు. అందాకా బొంబాయినగరం మహారాష్ట్రం రాజధానిగా వుండవలసిందేనన్నారు.

శ్రీ ఎస్. కె. పాటిల్ గూడా నేడు బొంబాయినగరం లేని మహారాష్ట్రాన్ని తలలేని శరీరంగా వర్ణించారు. అయితే బొంబాయి అవసరాల దృష్ట్యా అది ద్విభాషా రాష్ట్రంగా వుండటం తగునని వాదించారు. అన్ని గుజరాతీ ప్రాంతాలను, అన్ని మహారాష్ట్ర ప్రాంతాలను కలిపి ఇట్టి రాష్ట్రంగా ఏర్పాటు చెయ్యడానికి గుజరాతీలు, మహారాష్ట్రులు అమోదిస్తే బాగుంటుందని కూడా శ్రీ పాటిల్ సూచించారు.

ప్రతిపక్షుల్లో శ్రీ ఎన్. సి. ఛటర్జీ, డా॥ రామారావు, ఈ ఇద్దరు తమ ప్రసంగం బొంబాయి నగరాన్ని మహారాష్ట్రంలో చేర్చకపోతే వచ్చే బెడదలను గూర్చి మాట్లాడుతూ ఆర్థిక మంత్రి శ్రీ దేశముఖ్ రాజీనామా విషయమై ప్రస్తావించారు. శ్రీ ఛటర్జీ ఈలా అన్నారు. ఇప్పుడు ఆర్థిక మంత్రి పదివిలోంచి వైతొలగడం కన్నా దేశానికి వేరే నష్టం ఏమీలేదు. మన ఆర్థికమంత్రి మహా సమర్థులు. రెండో పంచవర్ష ప్రణాళిక సరిగ్గా అమలు జరగాలంటే ఆయన ఆ పదవిలో వుండి తీరాలి. ఇప్పుడు ఈమహారాష్ట్రంవ్యవహారంలో ఆయన రాజీనామా ఇస్తారని చదివి చాలా బాధపడ్డాను."

శ్రీ చటర్జీ బొంబాయి నగరం భవిష్యత్తును తేల్చడానికి గాండ్ పేబులే పద్ధతిని జరిపించవలసిందని సూచించారు. ప్రధాని తన పరువు, తనపక్షం పరువు ఇందువల్ల పోతుంది అనుకోకుండావుంటే, బొంబాయిసమస్య తేలిగ్గా పరిష్కారం అవుతుందని అన్నారు.

### పెద్దరాష్ట్రాలు

శ్రీ సత్యనారాయణసిన్హా బీహారు-బెంగాలువంటి పెద్దరాష్ట్రాలు దేశంలో ఏర్పడ్డం మంచిదని, దేశంలో ఒక ప్రాగ్దిశలోనేగాక, పశ్చిమ, దక్షిణ, ఉత్తర ప్రాంతాలలోగూడా పెద్ద పెద్ద రాష్ట్రాలు ఏర్పాటుకాగలవని తాను ఆశిస్తున్నానని అన్నారు.

శ్రీ తులసీదాస్ ఖిలాచంద్ గుజరాతీ, మరాఠీ, కన్నడ ప్రాంతాలను కలిపివేసి ఒకే పెద్దరాష్ట్రంగా ఏర్పాటుచేయడం తగునని వాదించారు.

శ్రీ గాడ్గిల్ ఈలా మాట్లాడారు: విదర్భను, మరాట్వాడాను మహారాష్ట్రంలో చేర్చడానికి తమ శక్తిని ఉపయోగించినట్లే, భారతప్రభుత్వం వారు బొంబాయి నగరాన్ని గూడా మహారాష్ట్రంలో చేర్చడానికి తమ శక్తిని వినియోగించాలి. బొంబాయినగరాన్ని మహారాష్ట్రంలో చేర్చవద్దంటున్న వారికి నచ్చచెప్పించాలి.

బొంబాయి నగరాన్ని గురించి సత్యాగ్రహం జరుగుతున్నది. దానికి నేను వ్యతిరేకిని. అయితే ప్రభుత్వం దీన్ని తిమ్మకవంచడానికి జరుగుతున్న ఉద్యమంగా భావించడం తగదు. మహారాష్ట్రులభావ సాంద్రతను వ్యక్తం చెయ్యడానికి మాత్రమే జరుగుతున్నట్లు గ్రహించాలి. ప్రజాస్వామ్య ధర్మవిహితంగా అభిప్రాయాన్ని వ్యక్తీకరించడానికి జరుగుతున్న ప్రయత్నంగా భావించాలి.

బొంబాయి కార్పొరేషను, హైదరాబాదు శాసనసభవారు బొంబాయిని మహారాష్ట్రంలో చేర్చవలసిందిగా తీర్మానించారు. ప్రభుత్వం ఈ విషయాన్ని గమనించాలి.

ఈచర్చలో ఇంకా శ్రీ అమర్‌సింగ్ సైగాల్, శ్రీ ఎస్. ఎస్. మోరే, శ్రీ ఫిరోజ్ గాంధి, శ్రీ ఎం. డి. జోషి, శ్రీ గురుపాదస్వామి, శ్రీ జె. హెచ్. జోన్ పాండే, శ్రీ బి. హెచ్. ఖార్దేకర్, ప్రభృతులంతా బొంబాయి నగరాన్ని మహారాష్ట్రంలో చేర్చవలసిందనే కోరారు.

## చక్కెర దిగుమతులు

### ప్రభుత్వానికి 8 కోట్ల లాభం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 24: ప్రభుత్వం విదేశాలనుంచి దిగుమతిఅయిన పంచదారమీద ఎనిమిదికోట్లరూపాయలు లాభం సంపాదించిందని ఆహార వ్యవసాయ శాఖల మంత్రి శ్రీ ఏ. పి. జైన్ లోకసభలో తెలియజేశారు.

### కామెర్ల వ్యాధి

ఆరోగ్య శాఖ ఉపమంత్రి శ్రీమతి చంద్రశేఖర్ మాట్లాడుతూ, మార్చి 31 వరకూ రాజధానిలో కామెర్లవల్ల 85 మంది మరణించారని వెల్లడించారు. దనిపోయినవారి ఆశ్రితులకు పరిహారం యిచ్చే ఆలోచన ఏదీ లేదనికూడా ఆమె తెలియజేశారు.

ఆరోగ్యశాఖా మంత్రి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ తమ ప్రసంగంలో ప్రభుత్వం దేశంలో పిచ్చిగా పెరుగుతున్న మొక్కలనుంచి మూలికల సేకరణకు ఒక కేంద్ర దేశీయ ఓషధీసంస్థను స్థాపించటానికి నిశ్చయించిందని వెల్లడించారు. ఈ సంస్థ ముఖ్యమైన మూలికలను పెంచటంతోబాటు వీటిపై పరిశోధనలను జరిపి ఓషధులను ఉత్పత్తి చేయవలెననీ ఔషధాలను తయారు చేయటానికి అవసరమైన అనేక మూలికలను (యిక్కడ దొరకనివి) తెప్పించి పైరు చేయగలదని గూడా మంత్రి వివరించారు.

దివాలా తదితర కారణాలవల్ల 1955-56 లో 10 భీమాసంస్థలు వ్యాపారాన్ని కట్టిపెట్టాయని రెవెన్యూ, సివిల్ ఖర్చుల మంత్రి ఎం. సి. షా తెలియజేశారు.

### వజ్రాలు

సహజ సంపదల మంత్రి శ్రీ కె. డి. మాళవియా 1955-56 లో మొదటి 10 మాసాల్లో దేశంలోని వజ్రాలగనుల నుంచి సుమారు మూడులక్షల యాభై వేల రూపాయల విలువగల వజ్రాలు లభించాయని చెప్పారు. విరుడు 3 లక్షల 40 వేల రూపాయలు విలువగల వజ్రాలు దొరికాయి.

## నాగార్జునసాగర్ కుడికాలువ పరిశీలన

### అదనపు డివిజన్ ఏర్పాటు

కర్నూలు, ఏప్రిల్ 25: నాగార్జునసాగర్ కుడివైపు కాల్వ త్రవ్వకం పరిశీలన వ్యవహారాన్ని పురస్కరించుకొని పూర్వపు రెండు డివిజన్‌లుగాక, నేడు అదనంగా ఇంకో డివిజన్‌ను 6 సబ్ డివిజన్‌లతో మంజూరు చేసింది.

ఇప్పుడు పూర్వపు రెండు డివిజన్లు 130 మైళ్ళ మేర ఈ కాల్వను గూర్చి పరిశీలన చేస్తున్నాయి. అడిషనల్ చీఫ్ ఇంజనీరు శ్రీ జి. వి. నరసింహారావు అధ్వర్యంలో ఈకార్యం సాగుతున్నది.

ఎడమవైపు కాల్వను గురించికూడా తగు పరిశీలన జరిపించవలసిందని, కృష్ణేరు దగ్గరనుంచి తెమ్మలేరు దాకా దీన్ని పండిగాము, మాచర్ల, వినుకొండ ప్రాంతాలలో పంట ప్రాంతాలమీదుగా తీసుకపోయే పద్ధతిని గూర్చి ఆలోచించవలసిందని ప్రభుత్వానికి అభ్యర్థనలువస్తున్నాయి. కాని యీ విషయంలో ప్రభుత్వం ఇంతవరకు ఏమీ నిశ్చయం చేయ. ఇది ఇంకా ఏమీ తేలలేదు, పరిశీలన జరుగుతున్నదనిమాత్రమే చెబుతున్నది. ప్లానింగ్ కమిషన్‌వారు గూడా యీ కాల్వనుగూర్చి గట్టిగా ఆలోచించవలసిందని రాష్ట్రప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నారు.

## బుడమేటి పథకంపై మళ్లీ నిర్ణయం వాయిదా?

### ముఖ్యమంత్రి లేరనే నెపం ఆసరా

కర్నూలు, ఏప్రిల్ 21: ఆంధ్రముఖ్యమంత్రి బుడమేరు విషయమైతాముసమావేశంలో పాల్గొనక పోయినా నిర్ణయం తీసుకోవచ్చు అని స్పష్టంగా సూచిస్తేనే తప్ప రిజర్వాయర్ విషయమై నిర్ణయం వాయిదాపడే అవకాశం లేకపోలేదని అధికార వర్గాలవారు భావిస్తున్నారు.

బుడమేరు సమస్యను ప్రభుత్వం అనిశ్చితంగా వదలివేయడం సబబుగాదు అని శాసనసభలో పలువురు సభ్యులు తీవ్రంగా విమర్శలు చేసినమీదట, ఈ విషయమై తాము అంతగా పరిశీలించలేదనీ, ఇంజనీర్లచే పరిశీలింపజేసి తగు నిర్ణయాన్ని తీసుకుంటామని ముఖ్యమంత్రి శాసన సభ్యులకు హామీ ఇచ్చారు.

మంత్రివర్గ సమావేశంలో పరిశీలన కోసం తయారుచేసిన వివరణపత్రం కేవలం పాక్షికంగా వున్నదని, పరిపూర్ణమైన వివరాలను అందచేయసెంలేదని, దానిమీద ఒక నిర్ణయం తీసుకోవడం ప్రమాదకరమనీ అధిక సంఖ్యాకులయిన మంత్రులు అభిప్రాయ పడ్డారు. అందునిమిత్తం బుడమేరుపై ఏ ఏ పథకాలు పరిశీలించారో ఇందులో యేది ఉత్తమమైనదని ఇంజనీరు నిర్ణయించారో, దీనిపై కేంద్ర ఇంజనీర్లు చెప్పినదేమో వివరిస్తూ ఒక నివేదికను చీఫ్ ఇంజనీర్ తయారు చెయ్యాలనీ, అంతవరకు ఈ సమస్యపై నిర్ణయాన్ని వాయిదా వెయ్యాలని మంత్రులు నిర్ణయించారు.

కిందటిసారి ముఖ్య మంత్రి ఇంజనీర్ల అభిప్రాయం స్పష్టంగా తెలియచేస్తూ, అవసరమైతే వారితో సమావేశం యేర్పాటు చెయ్యాలి అని, అందులో దీనిని చర్చించాలి అని సూచించగా కార్యదర్శి పాక్షిక వివరణతో ఉపముఖ్యమంత్రి దీనిని మంత్రి మండలికి పంపించారు. తాము ప్రజాభిప్రాయాన్ని తెలుసుకుంటాము అని, ఇతర మంత్రులు కూడా ప్రజాభిప్రాయం తెలుసుకోవాలనీ పబ్లిక్ వర్క్సు మంత్రి సూచించగా ఇతర మంత్రులు ప్రజాభిప్రాయ సేకరణ వల్ల ప్రయోజనం లేదని చెప్పి అందుకు ఎలాంటి యత్నమూ చేయలేదు.

ప్రత్యేక చీఫ్ ఇంజనీరు నివేదిక ఇంతవరకూ తయారు అయినట్లు తోచదు. ఇరవై ఐదవ తేదీ లోపల వారు ఒక నివేదికను అందజేయడం కష్టసాధ్యమైన విషయం కాదు. బుడమేరు రిజర్వాయరు విషయమై ఇవాళ కొత్తగా కనుక్కోవలసిందేమీలేదు. వున్న నివేదికల సారాంశమే క్రోడీకరించవలసి వున్నది.

భారత వరదల నిరోధక చీఫ్ ఇంజనీర్ డా॥ కె. ఎల్. రావు గూడా తమ అభిప్రాయం తోఏకీభవిస్తున్నారని, రిజర్వాయరు ఎక్కడ కట్టినా ఫరవా లేదని వారన్నారనీ పబ్లిక్ వర్క్సు మంత్రి ఒక చోట అన్నారు. ఈ విషయమై ఇంత ఉద్రేకాలు పెచ్చుపెరిగినందువల్ల డా॥ రావుగారు తమ అభిప్రాయాన్ని బహిరంగంగాగాని, రహస్యంగాగాని, మిత్రులతోగాని, సంస్థలలోగాని చర్చించడానికి నిరాకరించారట. అయితే ఈ విషయమై ఉపముఖ్యమంత్రి, చీఫ్ ఇంజనీరు పి.డబ్ల్యు.డి. కార్యదర్శితో వారి అభిప్రాయాలను స్పష్టంగా రిజర్వాయరు అవసరమన్న సంగతి వారు వెల్లడించారు అని తెలుస్తున్నది.

ఇంజనీర్ల సభలో దామోదరలోయ ప్రాజెక్టుల విషయం మాట్లాడారట గాని ఆంధ్రరాష్ట్ర ప్రాజెక్టులసంగతి ఎత్తిపోనున్నారట. ఉపముఖ్యమంత్రి, పి. డబ్ల్యు. డి. కార్యదర్శితో వారు రిజర్వాయరు అవసరం అని చెప్పారట.

రాష్ట్రప్రభుత్వం ఈ విషయంలో సవ్యమైన నిర్ణయం చేయలేకపోతే సాంకేతిక ప్రవీణుల కు పరిపాలనా నిర్వాహకులకు వచ్చిన ఈ సంఘర్షణలో సాంకేతిక విషయాలపై యీ ఇద్దరిలో ఎవరిది ఆఖరిమాట కావాలి అని కేంద్రమే నిర్ణయించాల్సివుంటుందని ఒక ఇంజనీరు అన్నారు.

రేపు ఎల్లుండి సమావేశం అయ్యే బుడమేరు రైతులసభకు ఉప ముఖ్యమంత్రి వారికి తోచినవారికి ఆహ్వానాలు పంపించారు అని, అధికారరీత్యా యెవరికీ ఆహ్వానాలు పెళ్ళింది తమకు తెలియదని ఒకఅధికారి తెలియజేశారు.

## హైకోర్టు ప్రత్యేక శాఖ విశాఖపట్నంలో పెట్టుకోవచ్చు

### హైదరాబాదు ముఖ్యమంత్రి అభిప్రాయం

తెనాలి, ఏప్రిల్ 24: "ఆంధ్రప్రదేశ్ హైకోర్టును, హైదరాబాదులో ఏర్పాటుచేయాలని నిర్ణయం జరిగింది. హైకోర్టుకు ఇంకోశాఖ అవసరమని అనుకున్నట్లయితే, దానిని గుంటూరులోకన్నా, చక్కని వాతావరణం గల విశాఖపట్నంలో నెలకొల్పడం మంచిది" అని హైదరాబాదు ముఖ్యమంత్రి డా॥ బూర్గుల రామకృష్ణరావు మొన్న యిక్కడ పౌర సన్మానసభలో చెప్పారు.

ఆంధ్ర తెలంగాణాల విలీనం విషయం ప్రస్తావించి, ఇన్నాళ్లు విడివిడిగా రెండు ప్రభుత్వాల క్రింద ఉండడం చేత రాకపోకలు, అన్యోన్య సంబంధాలు అస్తవ్యస్తమవడంవల్ల, ఉభయప్రాంతాల తెలుగువారి మధ్య ఏవో కొన్ని భేదాభిప్రాయాలు యేర్పడ్డాయి. అయినా భాష, సంస్కృతి, అన్నీ ఒకటే గాబట్టి, యివేవీ తెలుగుజాతి ఏకమవడానికి అడ్డురాలేకపోయినవి. మన చిరకాల వాంఛితమైన అఖండ ఆంధ్ర అవతరించింది. "ఇక మన భావితవ్యాన్ని మనం దిద్దుకోవచ్చు" అని రామకృష్ణరావు అన్నారు.

రామకృష్ణరావుకు 22వ తేదీ ఉదయం పురపాలక సంఘం పౌరుల తరపున స్వాగతపత్రం సమర్పించింది. సభకు పురపాలక సంఘాధ్యక్షులు శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి అధ్యక్షత వహించారు. పురపాలక సంఘం సమర్పించిన స్వాగతపత్రంలో ఆంధ్ర-తెలంగాణా పేరు మార్పడం విషయంలో మీరు జంకకుండా వ్యవహరించి ఆ సమస్యను ఒడ్డు పట్టించారు, అలాగే హైకోర్టు విషయంలో కూడా విస్పష్టమయిన నిర్ణయం జరగడం అవసరం" అని విజ్ఞప్తి చేశారు. ఆంధ్ర-తెలంగాణాలను ఏకం చేయడంలో రామకృష్ణరావుగారు నెరపిన కృషికి జోహార్లర్పించారు.

భూసంస్కరణల విషయంలో హైదరాబాదు ప్రభుత్వం సాధించిన ఘనకార్యాన్ని శ్లాఘించారు.

రామకృష్ణరావు సమాధానం చెబుతూ, పోలీసుచర్య తరువాత హైదరాబాదులో జరిగిన అభివృద్ధికృషి వివరించారు. వీటిలో చెప్పుకోదగినవి భూసంస్కరణలని, అన్ని రాష్ట్రాలకంటె యీ సంస్కరణల విషయంలో హైదరాబాదే ముందడుగు వేసిందని మిగతా రాష్ట్రాలు హైదరాబాదును, భూసంస్కరణల విషయంలో అనుసరించాలని ప్లానింగు కమీషన్ గూడా సలహా యిస్తున్నదని తెలియజేశారు.

హైకోర్టువిషయం ప్రస్తావిస్తూ, హైకోర్టును హైదరాబాదులో నెలకొల్పాలని నిర్ణయం జరిగింది. అయితే హైకోర్టుకు మరో చిన్నశాఖ అవసరమని అనుకొన్నట్లయితే, గుంటూరులో వాతావరణం అంత బాగలేదు కనుక విశాఖపట్నంలో పెడితే బాగుంటుంది. ఏమైనా, యీ సమస్యను, ప్రధాన న్యాయమూర్తి నిర్ణయానికిగాని, గవర్నరు నిర్ణయానికి కాని వదలివేయాలి" అని ముఖ్యమంత్రి అన్నారు.

ముందు ముందు మనం అభివృద్ధిలోకి రావాలంటే, పెద్ద రాష్ట్రంలో భిన్న మనస్తత్వాలు పనికిరావన్న సంగతి గుర్తుంచాలి. భారతదేశంలో పెద్ద రాష్ట్రాలలో మూడవది అయిన మన రాష్ట్ర క్షేమానికి అందరం కలసికట్టుగా కృషిచేయాలి" అని విజ్ఞప్తిచేశారు.

సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ గోలి శేషయ్య, రామకృష్ణరావు చిత్రాన్ని గీసి, ఆయనకు సమర్పించారు. చిత్రకారుని ప్రతిభ కొనియాడుతూ, ముఖ్యమంత్రి ఆయనను పూలమాలలతో సత్కరించారు.

డా॥ రామకృష్ణరావు, పౌరసన్మానం అనంతరం చంద్రమౌళి భవనంలో ఉన్న, జిల్లా కాంగ్రెసు కార్యాలయానికి వెళ్ళారు. అక్కడ జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ [illegible] సత్యనారాయణ వారికి స్వాగతమిచ్చారు. అక్కడ ప్రత్యేకంగా నిర్మించిన పందిరిలో బహిరంగసభ యేర్పాటు చేయబడింది. శ్రీ ఆలపాటి వెంకట్రామయ్య అధ్యక్షత వహించారు.

స్వాగత పత్రానికి డా॥ రామకృష్ణరావు సమాధానం చెప్తూ, రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించిన తరువాత, ఇతర రంగాలలోకూడా స్వాతంత్ర్య సాధనకు కాంగ్రెసు కృషిచేస్తున్నదని, పంచవర్ష ప్రణాళికలు ఆ ప్రయత్న ఫలితమేనని అన్నారు. కాంగ్రెసు ప్రభుత్వము తన కార్యక్రమాలన్నీ చెల్లించలేదని విమర్శలు వస్తున్నవి. కాంగ్రెసు సంస్థలు గాని, ప్రభుత్వాలుకాని ప్రజలకు సేవ చేయడానికే యేర్పడ్డవి. యేమైనా పొరపాటు చేసివున్నట్లయితే వాటిని సరిదిద్దుకోవచ్చు" అని స్పష్టంచేశారు.

కాంగ్రెసు కార్యకర్తలు, ప్రభుత్వ విధానాలు ప్రజాదరణ పొందేటట్లుగా, ప్రభుత్వంతో సహకరించి పనిచేయాలని విజ్ఞప్తి చేశారు.

ఆంధ్రరాష్ట్రం విషయం ప్రస్తావిస్తు యీలా అన్నారు.

"మనం చిరకాలంగా కాంక్షిస్తున్న అఖండ ఆంధ్ర అవతరించింది. ఏవో కొన్ని ప్రతిబంధకాలు ఎదురొక్కటిగా వచ్చినమాట నిజమే. ఏ రాష్ట్రమైనా - ఎంత చిన్నదైనా - ఒక పెద్దరాష్ట్రంతో కలవవలసిన స్థితి వచ్చినప్పుడు తన వ్యక్తిత్వాన్ని కోల్పోవడానికి వెంటనే యిష్టపడదు. అందుకనే తెలంగాణా ప్రాంతంలో కొంత ఆందోళన జరిగింది. ఆ ప్రతిబంధకాలన్నీ తొలగిపోయినవి. అఖండ ఆంధ్రను యేర్పాటు చేసుకొనడానికి అందరూ అంగీకరించారు. స్థితిగతులు పునఃపరిశీలన చేసుకొన్నమీదట, ఆంధ్ర తెలంగాణాలు ఏకం కావడానికి ఐదేళ్లు వ్యవధి అనవసరమని అందరూ అంగీకరించారు. ఏ విషమైన తగాదాలు లేకుండా అంతా కారం పడిరింది. అయితే అంతటితో మన పని పూర్తికాలేదు. మనమంతా ముందు భారతీయులము, ఆ తరువాతనే మిగతావన్ని. భాషారాష్ట్రాల ఏర్పాటు ఒక రాష్ట్రానికి మరొక రాష్ట్రానికి అడ్డుగోడలు పెంచాలని ఉద్దేశ్యంతో జరుగలేదు. ఆ విభజన పరిపాలన సౌలభ్యంకోసమే జరిగింది. ఒకొక్కప్పుడు మనం పెద్దవిషయాలు మరచి, చిన్నవాటికి లేనిపోని ప్రాధాన్యత యిస్తాము."

జిల్లా కాంగ్రెసు సంఘం తమకు స్వాగతం యిచ్చినందుకు శ్రీరామకృష్ణరావు కృతజ్ఞత తెలుపుతూ, ముందు మన పరిచయం యింకా ఎక్కువ కాగలదని ఆశిస్తున్నాను. అఖండ ఆంధ్ర సుఖసౌభాగ్యాలకు సమైక్యంగా కృషిచేయగలమని అనుకొంటున్నానని అన్నారు.

## గూడూరుకు శ్రీ రంగాగారి రాక

గూడూరు, ఏప్రిల్ 27: శ్రీ ఎన్. జి. రంగా ఇవాళ యిక్కడికి వచ్చారు. వేముల కూర్మయ్య, యం. శేషన్న వారిని కలిసికొని సంప్రదించారు.

## కీ॥ శే॥ శ్రీ నోరి రామశాస్త్రి

తెనాలి, ఏప్రిల్ 22: ఆయుర్వేద భూషణ పండిత నోరి రామశాస్త్రిగారు ఏప్రిల్ 21 రాత్రి పరమపదించినారని తెలియజేయడానికి విచారించుచున్నాము.

## దక్షిణ అమెరికాతో రష్యా వ్యాపారవాంఛ

న్యూయార్కు, ఏప్రిల్ 24.— దక్షిణఅమెరికాతో వ్యాపారం సాగించాలని రష్యా కోరుతున్నట్టు రష్యన్ ప్రతినిధి ఐక్యరాజ్య సమితి ఆర్థిక సాంస్కృతిక విజ్ఞానసంస్థ సమావేశములో తెలియపరుస్తూ, ఆసియా దేశాలలో జరుగుతున్న వ్యాపారం రష్యా ఇస్తున్న సహాయం వివరాలు తెలిపారు.

చీనా, భారతదేశం, బర్మా, ఆఫ్ఘనిస్తాన్ మొదలైన దేశాలలో కర్మాగారాలు నెలకొల్పుతున్నారు. సాంకేతిక సహాయం ఇస్తున్నారు. మొత్తం 2100 కోట్లు రూబుల్సు (187½ కోట్ల పౌనులు) పారిశ్రామిక వృద్ధికి ఋణాలిచ్చారు.

## ఆదోనికి మంత్రుల ప్రయాణం

కర్నూలు ఏప్రిల్ 25: ఆంధ్ర ప్రభుత్వ స్థానిక పరిపాలన, మద్యనిషేధశాఖల మంత్రి డా॥ ఏ. బి. నాగేశ్వరరావు సహకార వాణిజ్యపన్నులశాఖల మంత్రి శ్రీ డి. సంజీవయ్య ఈ ఉదయం కారులో ఆదోనికి ఆదోని పురపాలక సంఘ రజతోత్సవాలలో పాల్గొనటానికి వెళ్ళారు. పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ వి. సి. సుబ్బారెడ్డి కార్యదర్శి శ్రీ కే. నరసింహారావు, స్థానిక పరిపాలన ఆరోగ్యశాఖల కార్యదర్శి, శ్రీ కే. అనంతరామన్ ప్రభృతులు కూడా ఆదోని వెళ్ళారు.

## బొంబాయి మార్కెట్

బొంబాయి, ఏప్రిల్ 25:

| | |
|---|---|
| వెండి | 182-7-0 |
| వాయిదా | 182-2-0 |
| బంగారం | 106-10-0 |
| వాయిదా | 106-8-0 |
| పవరసు | 66-4-0 |

నూనెగింజలు మార్కెట్టు మూసివేశారు.

## ఉష్ణోగ్రత

మదరాసు, ఏప్రిల్ 25: ఆంధ్రలోను, ఇతరచోట్లనూ ఎండవేడిమి నేను మామూలుకంటే ఎక్కువగా ఉంది. గన్నవరం, రెంటచింతలలో ఉష్ణోగ్రత అన్ని చోట్లలోకన్నా 111 డిగ్రీల వరకు పెరిగింది.

| | | | |
|---|---|---|---|
| కళింగపట్నం | — | 92 | 81 |
| గన్నవరం | — | 111 | 81 |
| కాకినాడ | — | 104 | 83 |
| బందరు | — | 95 | 83 |
| నెల్లూరు | — | 108 | 81 |
| నిడదవోలు | — | 105 | 81 |
| ఒంగోలు | — | 105 | 81 |
| రెంటచింతల | — | 111 | 81 |
| విశాఖపట్నం | — | 99 | 83 |
| అనంతపురం | — | 106 | 79 |
| ఆరోగ్యవరం | — | 99 | 77 |
| కడప | — | 109 | 85 |
| కర్నూలు | — | 109 | 84 |
| హైదరాబాదు | — | 105 | 77 |
| మదరాసు | — | 105 | 83 |
| బెంగుళూరు | — | 95 | 71 |
| బళ్ళారి | — | 105 | 79 |
| న్యూఢిల్లీ | — | 102 | 81 |

మదరాసు నగరంలో నేను ఉష్ణోగ్రత 105.7 డిగ్రీల వరకు పెరిగింది. ఉదయం 10 గంటలనుంచి దాదాపు మధ్యాహ్నం 1-30 గంటల వరకు వడగాలి వీచింది.

# బొంబాయి నగర భవిష్యత్తుపై చర్చలు

## పార్లమెంటులోని మహారాష్ట్ర సభ్యులకు శ్రీ నెహ్రూ ఆహ్వానం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 24: బొంబాయి నగరం భవిష్యత్తును గూర్చి చర్చించడం నిమిత్తం ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ పార్లమెంటులోని మహారాష్ట్ర సభ్యులను ఆహ్వానించినట్లు, ఈ చర్చలు ఈ నెల 27 వ తేదీన జరుగనున్నట్లు తెలుస్తున్నది.

బొంబాయినగర భవిష్యత్తును గూర్చి పునరాలోచన జరపవచ్చునని, ఇప్పుడు బొంబాయి నగరాన్ని మహారాష్ట్రంలో చేర్చకపోయినా అనంతరం ఏదో చెయ్యడానికి ఏర్పాట్లు జరగవచ్చునని పరిశీలకులు భావిస్తున్నారు.

ఇక లోక్ సభలో రాష్ట్ర పునర్నిర్మాణం బిలునుగూర్చి జరిగిన చర్చ అనంతరం లాబీ వర్గాలలోగూడా బొంబాయి నగరం సమస్య సత్వరంగా తేలే అవకాశం పూర్వంకన్నా ఇప్పుడు అధికం అయినట్లు తెలియ వచ్చింది. శ్రీ గాడ్గిల్ ప్రసంగం మాటుగా వుందిగాని, బొంబయినగరాన్ని గురించిన మహారాష్ట్ర వైఖరి అందులో అతి స్పష్టంగా సమర్యాదగా వ్యక్తం చేయబడింది. ఆయన ఇవ్వాళ్ళ కాకపోతే, రేపన్నా బొంబాయినగరం మహారాష్ట్రములో చేరకతప్పదని, అందాకా మహారాష్ట్ర రాజధాని బొంబాయిలోనే వుంటుందని ప్రకటించవలసిందని కోరారు.

### దేశ్‌ముఖ్ రాజీనామా వ్యవహారం

ఈ వ్యవహారం ఇట్లా సాగుతున్నందువల్ల, మహారాష్ట్ర పార్లమెంటు సభ్యులతో శ్రీ నెహ్రూ మంతనాలు సాగించనున్నందువల్ల, ఆర్థికమంత్రి రాజీనామాను ప్రస్తుతానికి ఇవ్వకపోవచ్చునని గూడా పరిశీలకులు భావిస్తున్నారు. నిన్న ఆయన బొంబాయినగరం విషయంలో తన వియోజకవర్గం యొక్క భావము, తన భావము, ప్రభుత్వంభావముతో ఏకీభవించడంలేదని, అందువల్ల తాను మంత్రిగా వుండటం సరిపడని సంకేతివి కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ సభలో వివరించారు.

### అరెస్టులు

ప్రత్యేక సంయుక్త మహారాష్ట్రం కోసం ఉద్యమం సాగిస్తున్న వారిలో 2848 మందిని మార్చి 9 నుంచి ఏప్రిలు 4 దాకా బొంబాయి రాష్ట్రములో బహు ప్రాంతాలలో తాము అరెస్టుచేయించినట్లు ముఖ్యమంత్రి శ్రీ మురార్జీ దేశాయ్ నేడు బొంబాయి శాసనసభలో వెల్లడిచేశారు. ఇందులో 698 మందిని బెల్గాం జిల్లాలోను, 209 మందిని బొంబాయి నగరంలోను, 412 మందిని ఉత్తర సతారాలోను, 811 మందిని నాసిక్ లోను, 140 మందిని కొలాబాలోను అరెస్టు చేయించారు. [illegible] నెలల ఖైదు, 200 రూపాయలు జరిమానా; జరిమానా చెల్లించకపోతే మరో రెండునెలలు ఖైదు విధించారు. [illegible]

### మొత్తం 12 వేల అరెస్టులు

లోక్ సభలో శ్రీ గాడ్గిల్ ప్రసంగం ప్రకారం ఈ సంయుక్త మహారాష్ట్ర వ్యమంలో బొంబాయి ప్రభుత్వం 1955 నవంబరు మొదలు 1956 ఫిబ్రవరి వరకు 12 వేలమంది మహారాష్ట్రీయులను అరెస్టుచేసింది. ఇందులో చాలామంది ఇంకా జైళ్ళలోనే వున్నారు.

### పట్టపగలే చీకట్లు

అంతేగాక శ్రీ గాడ్గిల్ ప్రస్తుతం బొంబాయి నగరంలో పట్టపగలే చీకట్లు క్రమ్ముతున్నాయన్నారు. ప్రభుత్వం సభలను, ఊరేగింపులను జరగనియ్యడం లేదు. బొంబాయి శాసనసభ స్వీకరించిన తీర్మానాన్ని గురించి, వికేంద్రీకరణాన్ని గూర్చి [illegible] సంయుక్త మహారాష్ట్రాన్ని గూర్చిన [illegible] ఇంగ్లీషు పత్రికలు [illegible] మహారాష్ట్రులను గురించి [illegible] అని శ్రీ గాడ్గిల్ అన్నారు.

# శ్రీ నేదునూరి గంగాధరం

## సన్మానానికి సంఘం ఏర్పాటు

మద్రాసు, ఏప్రిల్ 25: జానపద గేయాలు, పల్లెపాటలు, లోకోక్తులు, సామెతలు, పెక్కింటిగా సేకరించి, అముద్రిత వాఙ్మయ సేకరణలో అగ్రగణ్యత పొంది తెలుగు సాహిత్యానికి ఎంతో సేవచేసిన శ్రీ నేదునూరి గంగాధరంకు సన్మానం చేయడానికి యేర్పడిన సంఘము వారు, సుమారు రు 4 వేలను వరకు కొవలెనని ఉదారులు సాహితీ ప్రియులు విరాళము లు పంపి తోడ్పడవలెనని విజ్ఞప్తి చేస్తున్నారు. సమ్మాన సంఘములు శ్రీయుతులు మాగంటి బాపినీడు, మాటూరి సత్యనారాయణ, వు. ఎం. చెరుకూనారు శెట్టి, పర్వతనేని బ్రహ్మయ్య, జె. వి. సోమయాజులు, వాసా వెంకటేశ్వర రావు, యార్లగడ్డ శివరామకృష్ణ ప్రసాదు, వి. జి. ఎస్. ప్రసాద్, బి. నాగిరెడ్డి, కె. వి. స్వామి పండిత, మల్లికార్జునరావు జి. అప్పస్వామి, డా॥ జి. వి. సీతాపతి ఎ. ఆర్. జి. కె. ఎం. ప్రసాదు. శ్రీమతి లక్ష్మీరఘురామ్, శ్రీ గుంటూరు నరసింహారావు శ్రీ యండమూరి సత్యనారాయణ ఉన్నారు.

"శ్రీ గంగాధరం కడు పేదలు. వీరు సంపాదించిన గ్రంథముల సేకరం నేటికిని అముద్రితములు. వాటి ప్రచురణకు ప్రయత్నము చేయుటయే గాక, గంగాధరం చేసిన అమూల్యమైన యావజ్జీవ కృషికి సముచిత పారితోషిక మిచ్చి సత్కరించాల్సి ఉన్నది. దీనికి ఉదారులు, సాహితీప్రియులును మీ సహాయ మర్థిస్తున్నాము. విరాళములు పంపువారు శ్రీ మాగంటి బాపినీడు 68, 4 వ మెయిన్ రోడ్డు మద్రాసు 20 అను చిరునామాకు పంప వచ్చు" అని తమ విజ్ఞప్తిలో తెలియజేశారు.

# నిప్పులు చెరిగే ఎండ

## విజయవాడలో 112 డిగ్రీలు

విజయవాడ, ఏప్రిల్ 25: నిన్నటి నుంచి యిక్కడ ఎండ నిప్పులు చెరుగుతోంది. ఎండ తీవ్రత 112 డిగ్రీలున్నది. ఒక్కరోజులో 10 డిగ్రీలు పెరిగింది. వేసవికాలం మొదలైనది లగాయతూ, ఎండ యింత తీవ్రంగా ఉండడం యిదే ప్రారంభం. రాత్రి పొద్దుపోయినదాకా వడగాడ్పులు తగ్గడంలేదు.

# వాణిజ్యంలో బ్రిటన్ స్వార్థం

## ఆస్ట్రేలియాలో విమర్శ

కాన్బెర్రా, ఏప్రిల్ 24: వాణిజ్యంలో బ్రిటన్ స్వార్థం దూరదృష్టి లోపంవల్ల బ్రిటన్ ఒక్కటే కాక స్టెర్లింగ్ ద్రవ్య ప్రాంతం అంతటికీ ఆర్థికంగా దిగజారుతుందని ఆస్ట్రేలియా ప్రభుత్వాధికారి ఒకరు విమర్శించారు.

ఇప్పటి వాణిజ్యవిధానం బ్రిటన్ అనుసరిస్తోందంటే ఇతర స్టెర్లింగ్ దేశాలే నష్టం భరిస్తున్నాయన్నారు. స్టెర్లింగ్ ప్రాంతం సంపాదించే డాలర్ ద్రవ్యాన్ని మిగతా దేశాలు అవసరాలు, అభివృద్ధి కార్యక్రమాలు పోనాడుతుని పరిమితంగా వినియోగిస్తుంటే, బ్రిటన్ ఆహార వస్తువులకోసం పరిమితి లేకుండా ఖర్చు చేస్తున్నట్లు విమర్శించారు.

# హైదరాబాద్ సికింద్రాబాద్ కార్పొరేషన్లు

## కలిసిపోవాలని మంత్రి సలహా

హైదరాబాదు, ఏప్రిల్ 24: స్థానికసంస్థల పరిపాలనా మంత్రి శ్రీ గోపాలరావు ఎక్బోటే, హైదరాబాదు సికిందరాబాదు కార్పొరేషన్లు రెండూ కలిసిపోతే, పరిపాలనా సామర్థ్యాన్ని పెంపొందచేసుకుని డబ్బుఖర్చులో పొదుపు సాధించగలవని ఆశిస్తున్నానని అన్నారు.

ఆయన పత్రికావిలేఖరులతో మాట్లాడుతూ, యీ రెండు నగరాల కార్పొరేషన్లకు, జూన్ 26 న ఎన్నికలు పూర్తి అయి కొత్త కార్పొరేషన్లు జూలై 7 నాటికి యేర్పడగలవని చెప్పారు.

కొత్త కార్పొరేషన్ల చట్టంక్రింద ఎన్నికలు జరుగుతవని, యీ చట్టం ప్రకారం, కార్పొరేషన్లకు నామినేటెడ్ సభ్యులుంటారని, కార్పొరేషన్ అధికారాలుకూడా ఎక్కువ చేయబడినవని ఆయన తెలియజేశారు.

కొత్తగా యేర్పడే హైదరాబాదు కార్పొరేషన్లో 66 స్థానాలు ఉంటవి. ఇందులో 8 షెడ్యూల్డు తరగతులకు చెందినవి. సికిందరాబాదు కార్పొరేషన్లో 28 స్థానాలుంటవి. అందులో 4 షెడ్యూల్డు తరగతులకు ప్రత్యేకించినవి.

రెండునగరాల కాంగ్రెసు సంఘాల అభ్యర్థులనుంచి దరఖాస్తులు కోరగా హైదరాబాదు కార్పొరేషన్ స్థానాలకు 200 మంది, సికిందరాబాదు కార్పొరేషన్‌కు 75 మంది దరఖాస్తులు పంపారు. హైదరాబాదు కార్పొరేషన్లో యిప్పుడు సభ్యులుగా ఉన్న వారిలో సంగంమంది దరఖాస్తులు పంపలేదట.

# దక్షిణాఫ్రికాలో జాతి విచక్షణ

## కేప్‌సుప్రీంకోర్టుకు విజ్ఞాపన

కేప్‌టౌన్, ఏప్రిలు 24: దక్షిణాఫ్రికా వోటర్ల జాబితాలో నుంచి శ్వేతేతర వర్గాల వారి పేర్లను విడగొట్టాలనే శాసనం రాజ్యాంగ విరుద్ధంఅంటూ శ్రీ విలియం డేవిడ్ కొలిన్స్ అనే మిశ్రమజాతికి చెందిన ఒక వోటరు కేప్ సుప్రీంకోర్టులో దావా తెచ్చాడు.

ఈ సందర్భంలో వచ్చిన రాజ్యాంగ సవరణ శాసనంకూడా చెల్లదని తీర్పు ఇవ్వవలసిందిగా శ్రీ కొలిన్స్ కోరాడు.

ఈ కేసు విచారణ వినడానికి కోర్టుకి ఆ కేసులు రాజకీయ నాయకులు, పార్లమెంటు సభ్యులు, రాజ్యాంగ నిపుణులు వచ్చారు.

ఈ కేసులో ఎవరోడినా దక్షిణాఫ్రికా అప్పీలుకోర్టుకు అప్పీలు చెయ్యడంఖాయం. చివరితీర్పు అప్పీలుకోర్టుది అవుతుంది.

# బాణసంచా ప్రేలుడు

మచిలీపట్నం, ఏప్రిల్ 24: జవురు పేటలోని మసీదు వెనుక ఆవరణలో, నిన్న బాణసంచా అకస్మాత్తుగా ప్రేలింది. ఎవరికీ గాయాలు తగులలేదు.

శివగంగస్వామి ఊరేగింపుకు, పెళ్ళి ఊరేగింపులకు, యీ బాణసంచా తయారు చేశారని, దమ్ముకొన్నందున ఎండదెబ్బగా యీ ప్రమాదం సంభవించిందని తెలియ వచ్చింది.

ఈ ప్రేలుడు గురించి పోలీసులు ఆరుగురిని విచారించారు.

యూసఫ్ అనే అతను, యీ బాణసంచా తయారుచేశాడని అతనికి, నేషనల్ కాలేజి ఆవరణలో ఫిటవి తయారు చేయడానికి లైసెన్సు ఉన్నదని తెలిసింది.

1952 లో, యిప్పుడు ప్రేలుడు జరిగినచోటే, బాణసంచా ప్రేలి 14 మంది తక్షణం మరణించారు.

# ఆయుర్వేదాన్ని ప్రోత్సహించాలి

## రాష్ట్రపతి రాజేన్‌బాబు హితవు

కాన్పూర్, ఏప్రిల్ 24: అల్లోపతి విధానంతోపాటు ఆయుర్వేద వైద్యాన్నికూడా సమానంగా ప్రోత్సహించాలని, ఈసాయంత్రం యిక్కడ ఒక వైద్యకళాశాలకు శంకుస్థాపన చేస్తూ రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ కోరారు.

"ఆయుర్వేద వైద్యవిధానం అశాస్త్రీయం గాబట్టి త్రోసివేయాలని చెప్పటం అశాస్త్రీయం" అన్నారు రాష్ట్రపతి.

డాక్టర్ రాజేంద్రప్రసాద్ తమ ప్రసంగంలో యింకా యీవిధంగా తెలియజేశారు. 'పూర్వకాలంలో అల్లోపతి వైద్యులు మందుకు గూడా లేనప్పుడు హకీములు, ఆయుర్వేద వైద్యులు వ్యాధిలక్షణాలను పరిగాఅవగాహన చేసుకొని వాటిని నయం చేశారు. ఈవిధానాలలో వారు నిపుణులు. నవీన అల్లోపతి వైద్యులు ఆయుర్వేదాన్నికూడా అభ్యసించాలి.'

'గత రెండు యుద్ధాలలోనూ విజ్ఞానశాస్త్రాన్ని వినాశప్రక్రియగా ఉపయోగించారు. అయినప్పటికీ ఆకాలంలో వైద్యవిజ్ఞానం నిర్మాణాత్మకంగా అభివృద్ధిపొందింది. అనేక చిచిత్రఓషధులు కొత్తగా బయలుదేరాయి. ఈ ప్రక్రియల మూలంగా నయంకావని పెదని వెరచిన జాడ్యాలుకూడా కుదరటం ఆరంభించాయి.

వైద్యులు ప్రజాసేవ, త్యాగాలను ప్రధానంగా అలవరచుకోవాలి.

రోగనిర్ణయానికి ఉపకరించే అనేక వైద్యపరిశోధనలు సామాన్య మానవులకు అందుబాటులో లేవు.

'నాపమటుకు నేను గూడా ఒక రోగినే. కొబట్టి యీ వైద్యపరిశీలనలు అధికవ్యయంతో కూడినవని చెప్పటానికి నాకుగూడా హక్కు ఉన్నది. ఈ పరీక్షలు తేలికలో జరిగేటట్లు చేయగలిగితే బీద బిక్కీకూడా ప్రయోజనం పొందుతారు.

# బియ్యం ధర

## పెరుగుదలకు నిలవలే కారణం

### ప్రభుత్వ వివరణ

కర్నూలు, ఏప్రిల్ 24: ఆంధ్రలో ముఖ్యంగా మిగులు జిల్లాలలో ధాన్యం బియ్యం నిల్వ చేయడం వల్లనే,వాటి ధరలు పెరిగాయని, రాష్ట్ర ప్రభుత్వం ఆహార పరిస్థితికి సంబంధించిన నివేదికలో తెలియజేశారు.

బజార్లలోకి ధారాళంగా బియ్యం రావటంవల్ల, మార్చి 31 తో అంతమయినపక్షం రోజుల్లోనూ, బియ్యం ధరలు కొద్దిగా తగ్గాయి" అని అందులో పేర్కొన్నారు.

తూర్పు పశ్చిమగోదావరి జిల్లాలలో ధాన్యసేకరణ ఏజెంట్లను నియమించడమైనదని, గుంటూరు కృష్ణా జిల్లాలలో, ఏజెంట్ల నియమించేవిషయం ప్రభుత్వం ఆలోచిస్తున్నదని, యీ జిల్లాలలో ధరలు, ప్రభుత్వం నిర్ణయించినవాటి కన్నా ఎంతో ఎక్కువగా ఉండడం వల్ల ప్రభుత్వఖాతాన ధాన్యం సేకరించడం జరగడంలేదని, పైపెచ్చు, ప్రభుత్వం వద్ద, బియ్యం గోధుమ, తృణధాన్యాలు ఏవీ నిల్వలేవని, ఆ నివేదికలో తెలియజేశారు.

### ప్రత్యేక సంఘం అవసరంలేదు

ఆంధ్ర రాష్ట్రంలో ఆహారధాన్యాల ధరలను అదుపులో పెట్టే విషయం చూచేందుకు ప్రత్యేకంగా ఒక సంఘాన్ని వేయాలని, ఆంధ్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని అడగాలనుకోవడం లేదు అని ప్రభుత్వోద్యోగి ఒకరు అన్నారు. నిన్న లోక్ సభలో కేంద్ర ఆహార మంత్రి శ్రీ ఎ. పి. జైన్ చేసిన ప్రకటన విషయం ఈ ఉద్యోగి దృష్టికి తేగా యీ సంగతి చెప్పారు.

# ఆంధ్రలో చేనేత పరిశ్రమాభివృద్ధి

## రు 1 కోటి పథకాలు పంపాలని నిర్ణయం

కర్నూలు, ఏప్రిల్ 25: చేనేత పరిశ్రమాభివృద్ధి నిమిత్తం ఆంధ్ర ప్రభుత్వం 1 కోటి రూపాయల పైగా ఖర్చు కాగల పథకాలను త్వరలో అ. భా. చేనేత బోర్డుకు పంపుతోంది. ఈ పథకాలకయ్యే ఖర్చు యావత్తు చేనేత సెస్సునిధి నుండి యిస్తారు.

1956-57 లో ఆంధ్ర రాష్ట్రానికి సెస్సునిధి నుండి, చేనేత అభివృద్ధి పథకాల అమలు నిమిత్తం 71 లక్షలు కేటాయించారు. ఈ కేటాయింపుకు అ.భా. చేనేత బోర్డు ఎక్కువచేసే అవకాశం లేకపోలేదు. అయితే, ఆంధ్ర ప్రభుత్వం పంపే పథకాలపై అది ఆధారపడి ఉంటుంది.

# ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి కృషి చేసిన మహావ్యక్తి

## గుంటూరు సభలో 'విశ్వదాత' దివ్యస్మృతికి జోహార్లు

(స్వకీయ విలేఖరి)

గుంటూరు, ఏప్రిల్ 24: అఖిల సాహిత్య కళాభివర్ధక 'ఆంధ్ర సంసత్' ఆధ్వర్యమున శ్రీ పాలపర్తి రామమూర్తి గృహావరణలో మొన్న 'దేశోద్ధారక' "విశ్వదాత" కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి వర్ధంత్యుత్సవము జరిగినది.

శ్రీ చాపల్లి సూర్యనారాయణ అవధానుల వేదపఠనంతో ప్రారంభమయిన ఈ సభకు పురవస్తుశాఖ సూపరింటెండెంటు డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యం అధ్యక్షతవహించారు. సభకు పలువురు సాహిత్యపరులు కళాకారులు విచ్చేశారు.

అధ్యక్షులు తమ ప్రసంగంలో శ్రీ నాగేశ్వరరావుగారు ఆంధ్రులకు, ఆంధ్రదేశమునకు చేసిన సేవ చిరస్మరణీయము. అన్ని రంగములలోను ఆంధ్రుల వికాసమునకు తీవ్రమైన కృషి చేసిన మహావ్యక్తి, కొమర్రాజు లక్ష్మణరావు, ముల్లంపల్లి సోమశేఖర శర్మగారల వంటి ప్రతిభావంతులను తయారుచేయ కలిగింది శ్రీ నాగేశ్వరరావు పంతులుగారే నన్నారు.

అనంతరం శ్రీ పాలపర్తి రామమూర్తి శ్రీ నాగేశ్వరరావుగారి జీవిత విశేషములను వివరించి, ఆంధ్రపత్రిక ఆంధ్రదేశమునకు చేసిన సేవను ప్రస్తుతించారు. మిగిలిన పత్రికలమాట ఎలా ఉన్నా ఆంధ్రపత్రిక మాత్రము ఆంధ్రుల వికాసమునకు ఆంధ్రదేశమునకు సేవకొఱకే స్థాపింపబడినదని అంటూ శ్రీ నాగేశ్వరరావుగారి ప్రతిభను, పలుకుబడిని, చొరవ, చాకచక్యము మొదలగు అపూర్వ విశేషములను వివరీకరించారు.

తరువాత శ్రీ రావూరి రంగారావు శ్రీ నాగేశ్వరరావుగారు చేసిన అనేక దానములను వివరించి ఆంధ్రదేశములో ఏ సంస్కారి ఏపండితుడు కళాకారుడు గాని శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి ఆదరణను, సన్మానమును పొందకుండ యుండలేదన్నారు. శ్రీ నాగేశ్వరరావుగారు గొప్పదేశభక్తుడు, తపస్వి, త్యాగి, కళాపోషకుడు, వేదాంతియే కాక పటుడు కూడ అన్నారు. స్త్రీ పాత్రల ధరించి నాటకరంగమునకు వన్నె తెచ్చి, నాటక కళాపోషణకు ఎంతయో కృషి చేసిన మహావ్యక్తి శ్రీ నాగేశ్వరరావుగారు అన్నారు.

అనంతరం శ్రీ పిసుపాటి సూర్యనారాయణ ప్రసంగిస్తూ సాహిత్యరంగమునకు శ్రీ పంతులుగారు చేసిన మహోత్కృష్టమైన సేవకు జోహార్లు సమర్పించారు. నాటికిని నేటికిని 'భారతి'వంటి సాహిత్యపత్రిక ఆంధ్రదేశములో పుట్టలేదన్నారు. 'భారతి' నిజంగా 'ఆంధ్ర భారతి'యే నన్నారు.

కార్యదర్శి శ్రీ జంధ్యాల సీతారామశాస్త్రి వందనములు సమర్పిస్తూ అన్నివిధముల ఆంధ్రులకు నోములపంట, సులక్షణముల మూర్తియయి శ్రీ నాగేశ్వరరావుపంతులుగారికి [illegible] ప్రకటించు, వారి సుగుణములకు కృతజ్ఞతగా వారి సేవల స్మరించుకొని వారి ప్రభోధము వలన ఆంధ్రదేశమునకు మన విద్యుక్తవిధులను నిర్వహించుకోవటం మన కనీసకర్తవ్యమని, ఆ మహామహులు స్థాపించిన 'ఆంధ్రపత్రిక' నేను శ్రీ శంభు ప్రసాద్ గారిచే జయప్రదంగా నిర్వహింపబడుచు ఆంధ్రుల సర్వతోముఖ వికాసమునకు అనంతమైన సేవ చేయ గల్గటం ఆంధ్రుల భాగ్యమన్నారు.

## పార్లమెంటు సభ్యుని అరెస్టు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 24: బెంగాల్ బీహార్ విలీనకరణను వ్యతిరేకిస్తూ కలకత్తాలో ఒక ప్రదర్శన జరిగిందనీ, ఈ సందర్భంలో పార్లమెంటు సభ్యుడు శ్రీ తుషార్ ఛటర్జీ అరెస్టయారనీ సభాపతి శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగార్ లోక్ సభలో తెలియజేశారు.

# అల్జీరియా మిత్రులు ఫ్రెంచి శత్రువులేట!

పారిస్, ఏప్రిల్ 24: అల్జీరియాలో ఫ్రెంచి పాలకుల చర్యల్ని సమర్థించేవారే తమ మిత్రులనీ, విమర్శించేవారు శత్రువులనీ ఫ్రెంచి ప్రధాని శ్రీ గైమోల్ సోవియట్ పత్రికా రచయితలకు ఫ్రాన్సులోస్వాగతమిస్తూ ప్రకటించారు.

ఫ్రెంచి ప్రభుత్వ ఆహ్వానంపైన సోవియట్ పత్రికా రచయితలు ఫ్రాన్సు సందర్శిస్తున్నారు.

అట్లాంటిక్ కూటంపట్ల ఫ్రాన్సు ఎల్లప్పుడూ విధేయతతో ఉంటుందనీ, ఆ కూటం భద్రతా స్వాతంత్ర్యాలు సాధించేదనీ శ్రీ మోలే అన్నారు.

సహజీవన విధానంలో ఫ్రాన్సుకి విశ్వాసం ఉందికాని, అది మాటల్లో మాత్రమే మిగిలిపోకుండా చేతల్లో కూడా కనపడాలన్నాడు.

# స్వాతంత్ర్యోద్యమాన్ని ఎవ్వరూ అణచలేరు

బొంబాయి, ఏప్రిల్ 24: ఆగ్నేయాసియా పర్యటిస్తున్న అల్జీరియాజాతీయ ప్రతినిధివర్గ సభ్యుడు శ్రీ మహమ్మద్ యాజిద్ అల్జీరియాలో జాతీయ సమరాన్ని అణచివెయ్యడానికి ఫ్రెంచి పాలకులు ఇంతకాదు మరింత సైన్యాన్ని తెచ్చినా అణచ లేదన్నారు.

శ్రీ యాజిద్‌కి ఇక్కడ భారత-అరబ్ మైత్రి సంఘం విందుచేశారు.

ఫ్రాన్సు అట్లాంటిక్ కూటంలోని తనసైన్యాన్నంతనీ తెచ్చిందనిచెప్తూ, జాతీయవాదులకు ప్రజలు అండ ఉన్నందువలన ఈ సైన్యం ఏమీ చెయ్యలేదన్నారు.

అల్జీరియా స్వాతంత్ర్య సమరాన్ని భారతదేశం బలపరుస్తుందని ఆశిస్తున్నట్లు శ్రీయాజిద్ చెప్పారు.

# గాంధీ విజ్ఞాన సర్వస్వం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 23: మహాత్మాగాంధీ రచనలను, ప్రసంగాలను ఉత్తర ప్రత్యుత్తరాలను సేకరించి ప్రచురించటానికి ప్రభుత్వం ఒక సలహా సంఘాన్ని ఏర్పాటు చేసింది. దీనికి సంబంధించిన సాధన సామగ్రిని గమకు పంపవలసిందిగా ఒక విజ్ఞప్తి చేసింది.

# నెహ్రూ ప్రభుత్వంపట్ల కమ్యూనిస్టుల వైఖరి

## పాలఘాట్ సభలో వాగ్యుద్ధాలు

పాలఘాట్, ఏప్రిల్ 24: ఈ నెల 19నుంచి యిక్కడ సమావేశం అవుతున్న కమ్యూనిస్టుపార్టీ చతుర్థ సమావేశంలో ఇదవరకు ఏ కమ్యూనిస్టు సమావేశంలోనూ జరగనంత తీవ్ర ప్రచారం సాగిపోతున్నది. ఈ సమావేశంలో 460మంది ప్రతినిధులు పాల్గొంటున్నారు. నెహ్రూ ప్రభుత్వం శకంలో అనుసరిస్తున్న విధానం పట్ల పార్టీ అనుసరించాల్సిన వైఖరిపై కేంద్రసంఘంలో తీవ్రవాగ్యుద్ధం జరిగింది. అగ్రనాయకుల మధ్య ఏకాభిప్రాయం కుదరనందువల్ల యీ విషయాన్ని నిన్న పార్టీ కాంగ్రెస్ సర్వసభ్య సమావేశం చర్చించింది. అయినప్పటికీ ఒక నిర్ణయం ఏదీ జరగకపోవటంవల్ల యీరోజు కూడ చర్చ సాగుతున్నది.

శ్రీ పి. సి. జోషీ, తదితరులు, కేంద్ర సంఘంలో ఎక్కువమంది అభిప్రాయానికి వ్యతిరేక పంథాను అనుసరిస్తూ తమ విధానానికి సంఖ్యాబలం కూర్చుకోటానికి తీవ్ర ప్రచారం సాగిస్తున్నారు.

శాంతి ప్రభుత్వాన్ని, ప్రభుత్వవిధానాలను తమ బలపరుస్తున్నంతగా, సుస్థిరం యివ్వని వారిని గూడ తమను తాలో చేర్చుకోటానికి శ్రీ జోషీ తయారుగా ఉన్నారని తెలుస్తున్నది. ఈవిధానం నవకేటేంటు యిప్పటిదాకా లాడుతుందని ఆకర్షిస్తున్నదని అభిజ్ఞులు చెప్తున్నారు. పార్టీ కార్యదర్శి శ్రీ ఏ. కె. ఘోష్ నాయకత్వంలో విశ్వాసం ఉన్న చాలా మంది కేంద్ర సంఘసభ్యులు, ప్రభుత్వ అంతరంగిక విధానాలకు, విశేషంగా విముక్తవాత్మక పదవిలో మనకు యివ్వాలనే తమ మునుపటి పద్ధతికి అంటి పెట్టుకొని ఉన్నారు.

రాబోయే ఎన్నికల్లో కాంగ్రెస్ విధానాలను అనుసరించి, పార్టీ అవలంబించాల్సిన పన్నాగాలు, యీ సమావేశ కార్యక్రమంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయని తెలుస్తున్నది.

కేంద్ర సంఘంలో మొదట, ఈ సమావేశంలో [illegible] యింతవరకూ [illegible] పైగా విభిన్న బలాలమధ్య అభిప్రాయ భేదాలు తప్పని సరిఅయ్యేటట్లుగా కనిపిస్తున్నది.

# దిమిలిలో గాంధి విగ్రహం

## శ్రీ గౌతు లచ్చన్నచే ఆవిష్కరణ

[స్వకీయ విలేఖరి]

యలమంచిలి, ఏప్రిల్ 19: ఇక్కడికి 8 మైళ్ళ దూరమునగల దిమిలిగ్రామములో పూజ్య బాపూజీ శిలావిగ్రహమును శ్రీ గౌతు లచ్చన్న 17 రాత్రి ఆవిష్కరించారు. ఆ సందర్భంలో పార్లమెంటు సభ్యుడు శ్రీ వి. వి. రమణ అధ్యక్షతను బహిరంగసభ జరిగింది. సభకు శ్రీయుత మజ్జి పైడయ్య నాయుడు, బీశెట్టి అప్పారావు ప్రభృతి ప్రముఖులు విచ్చేశారు. బాపూజీ విగ్రహమును ఆవిష్కరిస్తూ విగ్రహములను నెలకొల్పినంత మాత్రమున లాభము లేదని కార్యరూపమున ఆయన సిద్ధాంతములను ఆచరణలో పెట్టినప్పుడే విగ్రహప్రతిష్ఠలు సఫలను కాగలవని శ్రీ లచ్చన్న సలహా యిచ్చారు. వందన సమర్పణతో సభ ముగిసినది.

ఆరాత్రి శ్రీ పప్పల బాపునాయుడు, శ్రీ లచ్చన్నకు అతిథ్య మిచ్చారు. 18 తేదీ ఉదయం, యలమంచిలి విచ్చేసి కాంగ్రెసు కార్యకర్తల సమావేశములో పాల్గొన్నారు.

# బుడంపాడు పంచాయతీ

గుంటూరు, ఏప్రిల్ 24: ఈ నెల 21 వ తేదీన బుడంపాడు గ్రామ పంచాయితీకి జరిగిన ఎన్నికలలో, ఈ దిగువ వారు ఎన్నికైనారు. 1వ వార్డు శ్రీ ఆకుల పాంబయ్య, 2 వ వార్డు నాదాబత్తుని పకీరయ్య, పగడాల రామయ్య, 3 వ వార్డు వుర్రా సాంబయ్య, 4 వ వార్డుకు యింకా ఎన్నికలు జరుగలేదు.

# గాలన్ నీళ్ళు అర్ధరూపాయి!

[illegible], ఏప్రిల్ 23: సౌదియా [illegible] ప్రాంతంలో నేటి కొరత మూలంగా గాలన్ నీటిని [illegible] నుంచి ఎనిమిదణాల వరకు అమ్ముతున్నారు.

# అలబామా బస్సుల్లో జాతి విచక్షణ

## సుప్రీం కోర్టు తీర్పుకి ధిక్కారం

మాంట్ గోమరీ, ఏప్రిల్ 24: బస్సు రవాణాలో జాతి విచక్షణ రాజ్యాంగ విరుద్ధం అని దక్షిణ కెరోలిన్ రాష్ట్రంకేసులో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు తమకు వర్తించదంటూ అలబామా రాష్ట్రం అధికారులు ధిక్కరిస్తున్నట్లు ప్రకటించారు.

అలబామా రాష్ట్రం ముఖ్యనగరమైన మాంట్ గోమరీలో ఒక బస్సు కంపెనీ సుప్రీంకోర్టు తీర్పునే పాటించాలనే పట్టుదలతో యీ స్థానికాధికారుల్ని ధిక్కరించింది. ఇవాళ మొట్టమొదటవారిగా ఉదయం ఈ కంపెనీ నీగ్రోలకు తెల్లవారికి వేరు వేరు స్థానాల ఏర్పాటు రద్దుచేసి బస్సులు నడిపింది.

అలబామారాష్ట్రం రాష్ట్ర శాసన సభ వేర్వేరుస్థానా లేర్పాటు చేయాలని ఇదివరలో శాసనంచేసింది. ఇప్పుడా శాసనమే అలబామాలో వర్తిస్తుందనీ, ఆ శాసనాన్ని ధిక్కరించి సుప్రీంకోర్టు తీర్పుని అమలు జరపడానికి ప్రయత్నించేవారందరినీ అరెస్టు చేస్తారని మాంట్ గోమరీ పోలీసు కమీషనరు ప్రకటించారు. మేయరూ, అలబామా గవర్నరు మొదలైన అధికారులందరూ జాతివిచక్షణ పాటించితీరగలరని ఆవేశంతో ప్రకటనలు చేశారు.

ఈ బస్సుకంపెనీ తమ బస్సుల్లో నీగ్రోలు తెల్లవారూ కలిసే కూచోవాలని బస్సుల్లో ప్రకటనలు అంటించి బస్సులు నడిపింది. కాని ఇంతవరకూ నీగ్రో ప్రయాణీకులు మామూలు ప్రకారం వెనక స్థానాల్లో కూర్చుంటున్నారు. అందువల్ల ఇంతవరకూ అరెస్టులేవీ జరగలేదు.

# దుర్గానగర్‌లో విద్యుద్దీపాలు

[స్వకీయ విలేఖరి]

యలమంచిలి, ఏప్రిల్ 19: నిన్న రాత్రి విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ గౌతు లచ్చన్న, పాయకరావు పేట దుర్గానగర్ లో విద్యుద్దీప ప్రారంభోత్సవము చేశారు. ఈ ప్రారంభోత్సవ సభకు శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు రాజా వత్సవాయి వెంకట కృష్ణరాజ బహద్దూర్, బీశెట్టి అప్పారావు, ఆర్. లచ్చాపాత్రుడు, ముచ్చాల పోతురాజు, దొండ శ్రీరామమూర్తి (శాసనసభ్యులు), విద్యుచ్ఛక్తి ఎగ్జిక్యూటివ్, అసిస్టెంటు ఇంజనీరు తదితర ప్రముఖులు సభలో పాల్గొన్నారు.

పాయకరావు పేట, నామవారం పంచాయతీ బోర్డులు, గ్రామాభివృద్ధి సంఘమువారు మంత్రికి స్వాగత పత్రములను సమర్పించారు.

స్వాగత పత్రాలకు మంత్రి లచ్చన్న సమాధాన మిస్తూ వ్యవసాయము, పరిశ్రమల అభివృద్ధికిగాను ప్రభుత్వము ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అభివృద్ధికి తలపెట్టిన కార్యక్రమాలు వివరించారు.

మాజీ సేతపని వారి విషయం ప్రస్తావిస్తూ ప్రభుత్వం ఒక పథకం అమలు జరుపుటకు నిశ్చయుగా న్నదని సూచాయ చెప్పారు.

శ్రీ యర్రా రామారావు వందనసమర్పణతో సభ ముగిసింది.

# రైలు ఆలస్యమైనందుకు ప్రయాణీకుల అధిక్షేపణ

## మిగతా రైళ్లకు ఆటంకం: ఆగ్నేయ రైలుమార్గంలో సంఘటన

కలకత్తా, ఏప్రిల్ 24: రైలుబండి వేళతప్పి నడిచినందుకు గాను ప్రయాణీకులు రైలుమార్గంమీద కూర్చుని,దారినిపోయే తక్కిన అన్ని రైళ్లను కూడా ఆపి ప్రయాణాలు 8 గంటలు ఆలస్యం అయ్యేటట్లు చేసిన సంఘటన ఒకటి ఇవ్వాళ జరిగింది.

ఆగ్నేయ రైలుమార్గంలో హౌరా-ఖరగ్‌పూర్‌ల మధ్య బిర్‌శిబ్‌పూర్ స్టేషనువద్ద ఇది జరిగింది. స్థానికంగా నడుస్తున్న ఒక రైలు ఆలస్యం కాగా, అందుకు అధిక్షేపణ సూచకంగా వీరు ఈ పనిచేశారు. ఉదయం 7 గంటలకు రైలుదారిమీద కూర్చుని సాయంత్రం 3 గంటలదాకా లేవలేదు. కలకత్తా నుంచి, ఖరగ్‌పూరు నుంచి అధికారులు వచ్చి, వారిని బ్రతిమాలి అప్పుడు లేవదీశారు.

అందాకా కలకత్తా నుంచి బొంబాయికి పోయేబళ్లు, మద్రాసుకు పోయే బళ్లు, హౌరా-నాగపూర్ ప్యాసెంజరు అన్నీ ఆగిపోయినవి.

# ఉద్యోగాలు చూపే సంస్థలు

## ఆంధ్రలో జూన్ 30 న ప్రభుత్వ స్వాధీనం

కర్నూలు, ఏప్రిల్ 25: ఆంధ్రలో, ఎంప్లాయ్‌మెంటు ఎక్స్చేంజీలను (ఉద్యోగావకాశాలుచేసే సంస్థలు) జూను 30న గాని, లేదా, ఏర్పాట్లన్నీ పూర్తి అయితే యీలోగా గాని, ప్రభుత్వ స్వాధీనం అవుతాయి.

కేంద్ర ప్రభుత్వ నిర్ణయం ప్రకారం ఏప్రిల్ 1 వ తేదీని రాష్ట్రప్రభుత్వం స్వాధీనం చేసుకోవలసి ఉండెను కాని యేర్పాట్లు పూర్తి కానందున జూను 30 దాకా వాయిదా వేయడమైంది.

# కంచిసముద్రంపంచాయతీ

కంచిసముద్రము, ఏప్రిల్ 21: హిందూపురం తాలూకా కంచిసముద్రము పంచాయితీకి 20 వ తేదీన యీ దిగువవారు ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

శ్రీయుతులు: జారెప్ప, బుచ్చన్న, నారాయణరెడ్డి, రామన్న, అప్పాజి శాస్త్రి, గంగిరెడ్డి, నంజిరెడ్డి, రామన్న (తిరుగ్వాను) హిందూపురం డెప్యూటీ పంచాయితీ ఆఫీసరు శ్రీ ఆర్. శంకర నారాయణరావు ఎన్నికల కార్యక్రమము నిర్వహించారు.

# పబ్లిక్ వర్క్సుశాఖ కార్యదర్శి

కర్నూలు, ఏప్రిల్ 25: ఆంధ్రప్రభుత్వ పబ్లిక్ వర్క్సుశాఖ కార్యదర్శి శ్రీ వి. వి. సుబ్రహ్మణ్యం నిన్న మదరాసు వెళ్లారు. ఆయన 27 వ తేదీకి తిరిగి కర్నూలు వస్తారు.

# తంతి తపాలా సౌకర్యం

కర్నూలు, ఏప్రిల్ 25: తంతి పదుపాయాన్ని కర్నూలుజిల్లా కపుతలంలో అమర్చి ఉన్నారు.

